

ప్రతులకు

పరిమి రామకృష్ణశాస్త్రి

కైకలూరు (కృష్ణాజిల్లా)

తారకప్రభు ప్రింటర్స్, పెద్దాపురం ఫోన్ : 41605

R.L. narayana

# ధర్మానుష్ఠాన చంద్రిక



ధర్మో రక్షతి రక్షితః

ధర్మాన్ని నీవు రక్షిస్తే, ధర్మం నిన్ను రక్షిస్తుంది

ప్రవచనం :

పరిమి రామకృష్ణశాస్త్రి

కైకలూరు - 521 333

(కృష్ణా జిల్లా)

## శ్రీ హనుమద్ధ్యానం

గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసం
రామాయణ మహామాలా రత్నం వందే2 నిలాత్మజమ్
అంజనా నందనం వీరం జానకీ శోక నాశనం
కపీశ మక్షహంతారం వందే లంకా భయంకరమ్॥
యత్ర యత్ర రఘునాథ కీర్తనం తత్రతత్రకృతమస్త కాంజలిం
బాష్పవారి పరిపూర్ణ లోచనం మారుతిం నమత రాక్షసాంతకం॥

## జయపంచకం

జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభి పాలితః॥
దాసో2 హం కోసలేంద్రస్య రామస్యా క్లిష్ట కర్మణః
హనుమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః॥
నరావణ సహస్రంమే యుద్ధే ప్రతిబలం భవేత్
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః॥
అర్దయిత్వా పురీం లంకా మభివాద్యచ మైథిలీం
సమృద్ధార్థోగమిష్యామి మిషతాం సర్వరక్షసామ్॥
(సుందరకాండ 42వ సర్గ, 33, 34, 35, 36 శ్లోకములు)

ధర్మాత్మా సత్య సంధశ్చ రామో దాశరథిర్యది
పౌరుషేచా2 ప్రతి ద్వంద్వః శరైనం జహిరావణిం॥
(యుద్ధకాండ 91వ సర్గ 73 శ్లోకం)



నమోస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యైచ తస్యై జనకాత్మజాయై
నమోస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో
నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్యః॥
(సుందరకాండ 13వ సర్గ 50 శ్లోకం)

ఈ శ్లోకమును రోజుకు 11 పర్యాయములు చొప్పున 40 రోజులు పఠించిన కార్యసిద్ధి యగును.

మిక్కిలి శుభప్రదమైన నెమలి కన్నుల వింజామరను శంకరునికి సమర్పించిన వారికి కోటి సంవత్సరములు శివలోక ప్రాప్తి కలుగును.

గాయత్రికి మించిన మంత్రం, తల్లికి మించిన దైవంలేదు. ప్రణవముతో సమానమైనది రామనామము.

జ్ఞానాన్ని అందుకోవాలంటే తారకనామం చేసితీరాలి.

కృష్ణ, కృష్ణ, కృష్ణ - అని ముమ్మారు నిత్యము పఠించినచో పది వేల యజ్ఞములు చేసిన ఫలము వచ్చును.

హరేరామ, హరేరామ అను అష్టాక్షరీ మంత్రం నిత్యము ఎవరు జపము చేయుదురో వారు ఛండాలురైనను తరింతురు. సర్వపాప విముక్తులగుదురు. శాశ్వత ముక్తిని పొందుదురు.

"శ్రీరామ జయ రామ జయ జయ రామ" అను మంత్రము నిత్యము 73 సార్లు పఠించిన సర్వ కార్యసిద్ధిని కలిగించును.

సమస్త దేవతలకు 'అగ్ని' ముఖము కనుక 'అగ్నిని' సేవించిన సమస్త ఐశ్వర్యములు కలుగును.

శీర్ణించిన శివాలయములో ఒక అభిషేకము చేస్తే రోజా అర్చకత్వం జరుగుచున్న శివాలయంలో పది అభిషేకములు చేస్తే ఎంత ఫలితమో అంత ఫలితం కలుగును.

# మానవ ధర్మములు

1) ఉదయమున లేవగానే ధ్యానించవలసిన శ్లోకములు :

1) యస్మాత్ జాతం జగత్సర్వం
యస్మి న్నేవ ప్రపద్యతే
యేనేదం ధార్యతేచైవ
తస్మై జ్ఞానాత్మనే నమః॥

2) త్రైలోక్య చైతన్యమయా
ఆదిదేవా శ్రీనాథా విష్ణో
భవదాజ్ఞయైవ ప్రాతస్సముత్థాయ
తవప్రియార్థం సంసారయాత్రాం అనువర్తయిష్యే॥

3) సుప్తః ప్రబోధితో విష్ణో హృషీకేశేన
యత్త్వయా యద్యత్ కారయసే కర్మ తత్ కరోమి తవాజ్ఞయా॥

2) సముద్ర వసనే దేవీ పర్వత స్తనమండలే
విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వ మే॥

ఈ భూ ప్రార్థన, మంచము మీద కూర్చుని చేతులు భూమిమీద ఆన్చి చేయవలెను. తర్వాత కాళ్ళు భూమిమీద ఉంచాలి.

3) సూర్యోదయమునకు ముందుగానే నిద్ర లేవాలి.

4) సూర్యోదయమునందు నిద్రించువాడు అభినిమ్రుక్తుడను పాతకుడగును.

5) సూర్యాస్తమయమునందు నిద్రించువాడు అంశుమాన్ అను పాతకుడగును.

6) సూర్యునికి ఎదురుగా దంతధావన చేయరాదు. దంతధావన మధ్యవేలితో చేయవలెను.



7) దంతధావన నడుస్తూ చేయరాదు. ఉమ్మిలో పాచిపుండుట వలన చీమలు మొదలగునవి తిని మరణించును. ఆ పాపము ఉమ్మిన వారికి కలుగును.

8) మల మూత్ర విసర్జనము సూర్య చంద్రులకు ఎదురుగా చేయరాదు. గాలికి ఎదురుగా చేయవలెను.

9) తెల్లవారు జామున
4-5 గం॥ మధ్య చేయు స్నానం ఋషి స్నానం
5-6 గం॥ మధ్య చేయు స్నానం దైవ స్నానం
6-7 గం॥ మధ్య చేయు స్నానం మానవ స్నానం
7 గం॥ తర్వాత చేయు స్నానం రాక్షస స్నానం

10) చన్నీటి స్నానం ఉత్తమము
ప్రవాహ ఉదకమున స్నానం ఉత్తమోత్తమము.
చెరువులో స్నానం మధ్యమము
నూతివద్ద స్నానం అధమము.

మిగిలిన స్నానములకు పేర్లు లేవు. వేయి పనులు ఉన్నను మాని సకాలములో స్నానము చేయవలెను.

11) ప్రవాహమునకు ఎదురుగా పురుషులు, వాలుగా స్త్రీలు స్నానం చేయవలెను. (కుమారస్వామి జననము ఆధారముగా)

12) ఒక నదిలో స్నానము చేయుచు మరొక నదిని దూషించరాదు.

13) చన్నీటి స్నానము - శిరస్సు తడుపుకొని ప్రారంభించవలెను. (శిరస్సునందు జ్ఞాన కణములుండును కావున వాటిని రక్షించుకొనుటకు)

14) వేడి నీటి స్నానము - పాదములు తడుపుకొని ప్రారంభించవలెను. (నరములకు బలము కనుక)

15) స్నానము చేయునపుడు దేహమును పైనుంచి క్రిందకి రుద్దుకొనిన కామేచ్ఛ పెరుగును. అడ్డముగా రుద్దుకొనిన కామం నశించును.

16) సముద్ర స్నానమునకు వెళ్ళునపుడు ముందుగా చన్నీటి స్నానము చేసి, సముద్ర స్నానము చేయువలెను. తరువాత మరల చన్నీటి స్నానము చేయువలెను.

17) 15 నిమిషములు దాటి సముద్రంలో స్నానము చేసినచో పుంసత్వము నశించును.

18) మంగళ, శుక్రవారములలో సముద్రస్నానం చేయరాదు.

19) సముద్ర స్నానం వైశాఖ, ఆషాఢ, కార్తీక, మాఘ మాసములయందు, అర్ధోదయ, మహోదయ సమయములయందు చేయువలెను.

20) సముద్ర స్నానం చేయునపుడు బయట మట్టిని లోపల వేయువలెను. (సముద్రుని మా ఊరు రావద్దని).

21) నదులు, కాలువలు, చెరువులలో స్నానమునకు వెళ్లినపుడు, లోపల మట్టిని ముమ్మారు బయట వేయాలి. (అవి శాశ్వతంగా ఉండుట కొరకు)

22) స్నాన సమయమందు మౌనముగా ఉండనిచో తేజస్సు హరించును.

23) సూర్యోదయమునకు ముందుగాదే స్నానము చేసిన సూర్యుని శక్తి నీటిలో ఉండును కనుక ఆరోగ్యప్రదము.

24) పురుషుడు వస్త్రముతోనే స్నానము చేయువలెను. లేకున్న దేహము పిశాచగ్రస్తము అగును. స్త్రీ దిగంబరముగా స్నానము చేయవచ్చునని శాస్త్రము ఉన్నది.

25) స్నానమునకు వెళ్లునప్పుడు పాత్ర, పైమీద బట్ట రెండూ ఉండవలెను. లేనిచో అశుభము.

26) స్నానానంతరము ముందుగా ముఖము, తర్వాత వక్షము, పిదప శిరస్సు మిగత భాగములు తుడుచుకొనవలెను. ముందుగా శిరస్సు తుడుచుకొనిన దరిద్రం కలుగును.



27) స్త్రీలు స్నానము చేయునపుడు జుట్టు చివర ముడి వేసుకొనవలెను. లేనిచో దేహము పిశాచగ్రస్తమగును.

28) స్నానము చేయుటకు కట్టుకొని, తడిపిన బట్టను క్రిందికి వదలవలయును. ఈ బట్టను తానైనా ఉతికి ఆరవేయవలయును లేదా భార్య, పిల్లలు ఆరవేయువలెను. అంతేకాని ఇతరుల కివ్వరాదు.

29) బట్టలు మార్చుకొనేటప్పుడు పొడి బట్టను పైకి తీయువలెను. క్రిందకు విడువరాదు.

30) స్నానము ఎక్కువసేపు చేయువలెను.

31) స్నానములు మూడు రకములు. అవి

1. అభ్యంగన స్నానము (తలంటు పోసుకొనుట)
2. అవభృద స్నానము (దీక్ష చివర చేయునది)
3. అనుమర్షణ స్నానం (తడి బట్టచే దేహము రుద్దుకొనుట. జ్ఞానము బాగుగా వచ్చుటకు)

32)

| | | | | |
|---|---|---|---|---|
| ఆదివారం | తలంటు | స్నానము | - | తాపము |
| సోమవారం | " | " | - | కాంతి |
| మంగళవారం | " | " | - | మృతి |
| బుధవారం | " | " | - | లక్ష్మి |
| గురువారం | " | " | - | ధననాశనము |
| శుక్రవారం | " | " | - | విపత్తు |
| శనివారం | " | " | - | భోగము |

కలుగుచేయును. (ఇవి పురుషులకు మాత్రమే)

33) శిరస్సు స్నానం చేసినపుడే తడి విభూదిని పెట్టుకొనవలెను. కంఠ స్నానం చేసినపుడు పొడి విభూదిని పెట్టుకొనవలెను.

34) విభూదిని ముందుగా బొటన వ్రేలులో కుడి నుండి ఎడమకు పెట్టుకొని, మధ్యవ్రేలితో సరిచేసి తరువాత మధ్య మూడు వ్రేళ్లతో పెట్టుకొనవలెను.

35) విభూదిని మూడు గీతలుగా పెట్టుకోవడమంటే సత్వ రజ స్తమో గుణములకు అతీతుడని అర్థము.

36) కనుబొమ్మల మధ్య జ్ఞాన నేత్రము వుంటుంది కావున దానికి అచ్ఛాదనముగా కుంకుమ ధరించవలెను.

37) మానవుడు వ్రేలితో బొట్టు పెట్టుకోరాదు.

38 మాతన వస్త్రములు బొట్టు లేకుండా యిచ్చినచో పుచ్చుకొన్నవారు ఆరుమాసములలో మరణింతురు.

39) ముక్కు మొదలు, నాలుక చివర రెండూ కనిపించనిచో ఆరు మాసములలో మరణింతురు.

40) మానవుడు కర్పూర హారతి పుచ్చుకోరాదు.

41) పూజా పుష్పము శిరస్సుపై పెట్టుకోవలెను.

42) దళమును కుడిచెవిలో పెట్టుకోవలెను. బాహ్యమునకు వెళ్ళునపుడు జందెమును కుడిచెవికి చుట్టుకోవలెను.

43) భోజనానికి విస్తరి వేసినపుడు, అరటి ఆకు చివర కూర్చొనిన వారికి ఎడమవైపు వుండునట్లు వేయవలెను. కుడివైపునకు వుండునట్లు వేయరాదు.

44) చివరిలేని విస్తరి చర్మములో సమానము. కుట్టుడు ఆకు వేయవచ్చును.

45) ఇతరులకు భోజనము పెట్టినపుడు, యజమాని వారిని తన కుడివైపున కూర్చోపెట్టుకోవలెను.

46) భోజనానంతరం మజ్జిగ త్రాగవలెను.

47) ఒంటిగా భోజనం చేసిన పేరు లేదు.

ఇద్దరు కూడిన భుక్తి

ముగ్గురు కూడిన భోజ్యము

నలుగురు కూడిన భోజనము

కావున యజమాని తన బిడ్డలలో కలిసి భోజనం చేయవలెను.



48) భార్యా భర్తలు కలిసి భుజించరాదు (అయుక్తీణం)

49) భోజన సమయమునందు మంచినీటి చెంబును కుడివైపున వుంచుకొనవలెను.

50) ఉత్తర దిక్కుగా కూర్చొని భోజనం చేయరాదు.

51) పీట మీద ఒక కాలు, క్రింద ఒక కాలు వుంచి భోజనం చేయరాదు.

52) ఒంటి బట్టతో భోజనం చేయరాదు.

53) రెండు చేతులతో తప్ప, ఒంటి చేతితో నమస్కారం చేయరాదు.

54) నమస్కారం చేయునపుడు నమస్తే అనరాదు. పెద్దలకు "నమో నమః" సామాన్యులకు "నమోనమః" అనాలి.

55) పాదాభివందనము చేయువారు, తమ ఎడమ చేతిని అవతలివారి ఎడమ పాదముపై ఉంచి, ఆ చేతిమీదుగా తమ కుడి చేతిని అవతలవారి కుడి పాదముపై వుంచి ముమ్మారు కళ్ళకు అద్దుకోవాలి.

56) పురుషులు మాత్రమే భూమిదార అని సాష్టాంగ నమస్కారము చేయవలెను.

57) స్త్రీలు వక్షఃస్థలం నేలమీద ఆన్చిన స్త్రీత్వం నశిస్తుంది కనుక మోకాళ్ళు నేలపై ఆన్చి, తమ యెడమ పాదము మీద కుడిపాదము ఆన్చి సాష్టాంగ నమస్కారము చేయాలి.

58) ఆలయములలో, సభలో, ప్రభువు సన్నిధానములో, పీఠాధిపతుల సన్నిధానములో వ్యక్తులకు ప్రత్యేకంగా నమస్కరించరాదు. వారే నమస్కారమునకు అర్హులు.

59) పాదములు తాకి దణ్ణం పెడితే, దణ్ణం పెట్టించుకున్న వారికి శక్తులు పోతాయి.

60) ముని, సన్యాస వృత్తిలోనున్నవారు ఆశీర్వాదం చేయించుకొనరాదు.

61) పెద్దలు స్నానము చేయకుండ ఆశీర్వదించరాదు. కావున వారి స్నానానంతరమే నమస్కరించాలి.

62) ఉదయము తూర్పునకు తిరిగి పని ప్రారంభించవలెను. సాయంత్రం ఉత్తరమునకు తిరిగి ప్రారంభించవలెను.

63) తాంబూలము ఇచ్చునపుడు, తమలపాకుల చివుళ్ళు, అరటిపండ్ల చివుళ్ళు పుచ్చుకొనేవారికి ఎదురుగా ఉండవలెను. లేనిచో తాంబూలం వ్యర్థము.

64) తమలపాకులు మూడు లేక ఐదు, వక్కలుగాని పండ్లుగాని రెండు పెట్టవలెను.

65) భోజనానంతరం తాంబూలం నూరు అడుగులు నడచి వేసుకొనవలెను.

66) తమలపాకుల మీద  సున్నము చూపుడు వ్రేలుతో రాయకూడదు. బొటన వ్రేలితో వ్రాయవలెను.

67) ఆలయమునకు, పెద్దల వద్దకు, పీఠాధిపతుల వద్దకు వివాహానికి, పురాణానికి మొ॥ వెళ్ళునపుడు చెప్పులు వేసుకొన కూడదు. (పాదచారిగ వెళ్ళవలెను కనుక)

68) పెద్దల దగ్గరకు, తపోవనమునకు వెళ్ళేటప్పుడు వినయ విధేయతలతో వెళ్లాలి. అహంకారముతో వెళ్లరాదు.

69) యజ్ఞోపవీతము దేహ విమోచనం వరకు వుండాలి.

70) యజ్ఞోపవీతమునకు నూలు పోగు ముడి పడితే బ్రహ్మహత్యా పాతకము అవుతుంది.

71) ఉపనయనమప్పుడు మొదటిది. స్నాతక వ్రతమప్పుడు రెండవది, వివాహములో అత్తమామలు మూడవది, పైమీద వస్త్రము లేకుండా వున్న దోష పరిహారార్థము నాలుగవది యజ్ఞోపవీతములు గృహస్థునకు వేయుదురు.



72) నిద్రించునపుడు ఎడమ చేతిని తలక్రింద పెట్టుకొని, ఎడమ వైపునకు తిరిగి నిద్రించవలెను.

(సూర్యనాడి సంచరించుట వలన ఆరోగ్యము కలుగును.)

73) పలక మంచముపై పరుండునపుడు, కాళ్ళవైపు తల పెట్టి పరుండరాదు.

74) పట్టెమంచము నేయునపుడు బద్దెలు లెక్కపెట్టి నాలుగుతో భాగించగా శేషము ఒకటి వచ్చిన ఆయుర్దాయము, రెండు వచ్చిన లక్ష్మి, మూడు వచ్చిన కీర్తి, సున్న వచ్చిన మరణము వచ్చును. కావున నాలుగుతో భాగించిన శేషము మిగులవలెను. నిలువుకి నిలువే లెక్క, అడ్డానికి అడ్డమే లెక్క.

75) తడి కాళ్ళతో పరుండరాదు.

76) చెడు స్వప్నములు వచ్చిన వెంటనే లేచి, ఎండు పుడక గాని, తాటియాకు గాని తుంచి కాళ్ళు చేతులు కడుక్కొనినచో దోషము పోవును.

77) విశ్వామిత్ర సృష్టిలోవున్న వస్తువులను పితృకార్యములకు వాడరాదు. (వంకాయ, పెద్దగుమ్మడికాయ, పచ్చి మిరపకాయ, కరివేపాకు, గోంగూర, రెల్లు, కుంకుళ్ళు మొ॥)

78) 84 లక్షల జీవరాసులలో గోవుయే పవిత్రమైనది. మలమూత్రములు కూడ పవిత్రమే అయిన జంతువదొక్కటే.

79) కొద్ది స్నేహాన్ని నడిపేవాడు స్నేహితుడు.

80) చిరకాలము స్నేహము చేసేవాడు మిత్రుడు.

81) కడుపులోని మాటను చెప్పుకొనేవాడు సుహృత్.

82) మానవుని కాలిబొటన వ్రేలు నాడి ఆగిన రెండు గంటలలో మరణించును.

83) దుఃఖమనగా ఆపినా ఆగకుండా వచ్చునది.

84) శోకమనగా దృశ్యమును చూచిన వచ్చునది.

85) ముక్కువద్దనున్న కళ్ళ మొదలు నుండి వచ్చు నీరు దుఃఖము. కళ్ళచివరనుండి వచ్చు నీరు ఆనందబాష్పములు.

86) సంస్కారమును బట్టి భోగము, కర్మను బట్టి జన్మ వచ్చును.

87) స్త్రీలకు బేసి సంఖ్యగల అక్షరములతో పేరులు పెట్టుట మంచిది.

88) పురుషులకు సరి సంఖ్యగల అక్షరములతో పేరులు పెట్టుట మంచిది.

89) గర్భిణీ స్త్రీ ఏడవమాసము తర్వాత ఏ భావనతో వుంటుందో ఆ భావనగల సంతానం కలుగుతుంది.

90) స్త్రీలు పరకార్యము చేయునపుడు, పరపురుషునితో మాట్లాడవలసి వచ్చునపుడు భర్తను తలచుకొని చేసిన దోషము వుండదు.

91) స్త్రీ కాలి బొటనవ్రేలితో నేలపై వ్రాయరాదు.

92) భార్య చేసిన పాపంలో భర్తకు భాగముండదు. కాని భర్త చేసిన పుణ్యంలో భార్యకు సగం భాగం వుంటుంది. పాపంలో వుండదు.

93) మానవునికి బ్రహ్మజ్ఞానము కలవారి యందు భక్తి, శివపూజ, దానశీలత, సజ్జన సాంగత్యం, ఈ నాలుగు ఉండాలి.

94) భోజనము తక్కువ కాలంలో చేయవలెను.

95) దానము పాత్రత నెరిగి యిచ్చుట మంచిది.

96) అపాత్రునికి దానము చేసిన, వాడు చేసిన పాపము దానము చేసిన వారికి వచ్చును.

97) అతి దానము వలన పాడైనవాడు బలిచక్రవర్తి.

98) అతి కామం వలన పాడైనవాడు రావణుడు.

99) అతి లోభం వలన పాడైనవాడు దుర్యోధనుడు.

100) అతి కోపము వలన పాడైనవాడు విశ్వామిత్రుడు. కావున అతి ఎప్పుడూ పనికిరాదు.



101) భగవద్గీత అందరూ చదువ వచ్చును.

102) వాల్మీకి రామాయణంలోని సుందరకాండ స్త్రీలు పఠించరాదు. (గాయత్రీ మంత్రము ఉన్నది గనుక)

103) ఉత్తమ మానవుడు తన బలము, తనవారి బలము దైవబలము చూచుకొని కార్యము ప్రారంభించును.

104) మధ్యముడు తన బలము, తనవారి బలము చూచుకొనును.

105) అధముడు తన బలమే చూచుకొనును.

106) మాన, ప్రాణ రక్షణయందు ధర్మము చెడకుండ ధర్మ సూక్ష్మము పాటించవచ్చును.

107) శాశ్వత స్నేహము కోరువారు మూడు పనులు చేయరాదు. 1) వాగ్వివాదము 2) ధనము ఇచ్చి పుచ్చుకొనుట (అప్పు) 3) అతను లేని సమయమున అతని భార్యతో మాట్లాడుట.

108) పడమర నుండి తూర్పునకు ప్రవహించునది నది. తూర్పునుండి పడమరకు ప్రవహించునది నదము.

109) 5 సం॥ల వరకు పిల్లల పాప పుణ్యములు తల్లి తండ్రులకు సంభవించును. కనుక లాలించి పెద్దచేయవలెను. తర్వాత 10 సం॥లు శిక్షణలో ఉంచవలెను. 16 సం॥లు వచ్చిన తర్వాత కుమారుని మిత్రునిగా చూడవలెను.

110) కుళ్ళు అనగా తాను చేసిన పనివల్ల తనకు వచ్చు బాధ.

111) జ్ఞాని అజ్ఞాన నాశనాన్నే కోరుతాడు.

112) అవసరమైతేనే భూమిని త్రవ్వాలి. కారణము లేకుండా త్రవ్వితే ఉపద్రవము కలుగుతుంది.

113) దాతృత్వము, ప్రియవక్తృత్వము, ధీరత్వము, ఉచితజ్ఞత ఇవి సహజమైనవి. నేర్చుకుంటే వచ్చేవికావు.

114) వనిత, పండితుడు, తీగ ఆశ్రయము లేనిదే రాణించరు.

141) కామం ఎక్కువగా వుంటే, ఆ ఇంట ఐశ్వర్యముండదు.

142) గడప ఇవతల నుంచి భిక్షము పెట్టిన యెడల లక్ష్మి తొలగిపోవును.

143) కర్పూరము వేసవిలో దానమిచ్చినచో దుఃఖము తొలగును.

144) తల్లికి ఒకసారి, తండ్రికి రెండుసార్లు, పెద్దలకు మూడుసార్లు, భగవంతునికి నాలుగుసార్లు నమస్కరించాలి.

145) తాటాకు విసనకర్ర సుఖప్రదము. మట్టికుండ పవిత్రము. తాటాకు విసనకర్ర దానము చేసిన శుభప్రదము.

146) వేపచెట్టు లక్ష్మీ స్వరూపము. రావి చెట్టు విష్ణు స్వరూపము. కాబట్టి వేప, రావి చెట్లకు వివాహం చేస్తారు.

147) అశ్లీలము, అమంగళము అగు మాటలను ఎప్పుడూ అనకూడదు. శోభన దేవతలు గృహములో ఉండి, "తథాస్తు" అంటూంటారు కాబట్టి.

148) స్త్రీలకు సంతానం కలుగుటకు అడ్డుగానున్న శక్తిని రావి చెట్టు తొలగిస్తుంది. కాబట్టి అశ్వత్థ ప్రదక్షిణాలు చేస్తే సంతానం కలుగుతుంది. (ఈథర్ అను గాలి రావి చెట్టు ఆకులలోనుండి వచ్చును కనుక)

149) వేప చెట్టు రాత్రింబవళ్ళు ప్రాణవాయువును ఇస్తుంది. కాబట్టి దాని క్రింద ఎప్పుడైన ఉండవచ్చును. మిగిలిన చెట్ల క్రింద రాత్రుళ్ళు ఉండరాదు.

150) తెల్ల మద్ది చెట్టు (శింశుపా వృక్షము) గాలి, నీడ స్త్రీలకు ఆరోగ్యము నిచ్చును.

151) పారిజాతము జ్ఞానము నిచ్చును.

152) ఉసిరి చెట్టు క్రింద జపము చేసిన, చేయవలసిన దానికంటే తక్కువ జపముతో ఫలసిద్ధి కలుగును.

153) మౌనము వలన ఆయుర్దాయము పెరుగును.



154) ఆశీర్వచనము ఇతరులచేత చేయించుకొనవలెను. స్వయముగా చేసుకొనువారు ఒక సంవత్సరములో మరణిస్తారు.

155) ఈర్ష్య ఉన్నత స్థితికి చేరితే నాశనం కోరుతుంది.

156) పైపళ్ళతో క్రింది పళ్ళపై ధ్వని చేయరాదు. ఇది ఆరోగ్యమునకు మంచిది కాదు. (పళ్ళు నూరరాదు)

157) వచ్చిన వారికి మర్యాద చేస్తే గృహవాసి యొక్క మర్యాద నిలుస్తుంది.

158) పురుషులకు ఆత్మయే భార్యా స్వరూపము.

159) మామగారు కోడలికి ఆభరణములు ఇచ్చునపుడు, ఆమె మెడలో వేసుకొనేవే ఇవ్వాలి.

160) చదువుకొనేటప్పుడు ఇద్దరుండాలి. తపస్సు చేసేటప్పుడు ఒక్కరే ఉండాలి.

161) అశుభానికి వెళ్లునప్పుడు స్త్రీలు ముందు నడుస్తారు. శుభమునకు వెళ్లునప్పుడు పురుషులు ముందు నడుస్తారు.

162) భార్యతో సంప్రదించకుండా ఇతరులను భోజనానికి పిలువరాదు.

163) ఐదు గోళ్లు ఉన్న జంతువు మాంసం తినరాదు.

164) శత్రువైనా, వాని యొక్క మంచి గుణములు మెచ్చుకోవాలి.

165) మిత్రుడైనా, వాని యొక్క చెడ్డ గుణములు మెచ్చుకోకూడదు.

166) తండ్రి వద్ద విద్య, అల్లునితో భోజనము ఈ రెండూ అదృష్టముంటేనేకాని లభించవు.

167) ఆచారము వలన దైవత్వము, ఋషిత్వము లభించును.

168) అనాచారం వలన నీచ జన్మ వస్తుంది.

169) ప్రాతఃకాలమున ధర్మ కార్యములు ఆచరించాలి.

170) మధ్యాహ్నమందు ద్రవ్యము సంపాదించవలెను.

171) సాయంకాలము కోరికయందు ప్రవర్తించవలెను.

172) తల్లిదండ్రులను సేవించువారికి ధర్మము, జయము, సుఖము కలుగును.

173) తపశ్శక్తివలన కలిగేది దైవ భోగము. చెప్పి చేయించుకొనేది రాజ భోగము. తాను కావాలని చేసుకొనేది మానవ భోగము.

174) గృహప్రవేశము రాత్రి పూట చేయవలెను. పగటి పూట చేయరాదు.

175) గురువు ప్రతిధ్వనించ వచ్చును. కాని గృహములు ప్రతిధ్వనించ కూడదు.

176) మానవునికి ఉండికూడా కనబడకుండా ఉండేది దయ. తెలిసికూడా తెలియనిది మరణము.

177) ప్రొద్దుట ఎండ, శవదహనము చేసిన పొగ, ముఱికి నీరు, తనకన్న ఎక్కువ వయసుగల స్త్రీని వివాహమాడుట, రాత్రి పూట పెరుగు అన్నం తినుట ఆయుక్షీణములు.

178) సాయంత్రపు ఎండ, హోమ ధూమము, తనకంటె తక్కువ వయసుగల స్త్రీని వివాహమాడుట, నిర్మలోదకము త్రాగుట, క్షీరాన్నము (అన్నములో పాలుపోసుకొని) రాత్రి తినుట ఆయుర్వృద్ధి కలిగించును.

179) బ్రహ్మచారి, బలవంతుడు, ధీరుడు, మాయావి, మానవర్జితుడు, బుద్ధిమంతుడు, ఉదారుడు, శంకలేనివాడు మాత్రమే స్త్రీల వద్దకు రాయబారిగా వెళ్లుటకు అర్హులు.

180) ఏ పనైనా చేసినవారు, చేయించిన వారు, ప్రేరేపించినవారు, చూచి సంతోషించిన వారు - ఈ నలుగురికి సమాన వాటా వస్తుంది.

181) స్వగృహములో దొంగతనం చేసే స్త్రీ ఉన్నచో, ఆమె ఉన్నచోట ఐశ్వర్యముండదు.

182) ఇంటి నడికప్పు మాత్రమే కాలి చూరుంటే అక్కడ ఇల్లు



కట్టరాదు. ఒక్క ఇల్లే అంటుకొని వల్లారితే ఆ ఇంటి యజమాని పైకి రాడు. ప్రక్క ఇళ్లు కాలుతూ, తన ఇల్లు అంటుకుంటే, ఆ అగ్నిహోత్రంలో నేయి పోస్తే, ఆ ఇంటి యజమాని పైకి వస్తాడు.

183) భద్రాచలం మూడు సార్లు వెడితే, ఒకసారి కాశీ వెళ్లినంత పుణ్యం వస్తుంది.

184) రెండు తుమ్ములు తుమ్మిన శుభము.

185) తుమ్మిన తరువాత దగ్గిన వెళ్లువానికి లాభం.

186) తుమ్మి తరువాత ఏడిన, వెళ్లువారికి మరణం, తుమ్మి మరల తుమ్ముకున్నచో దుర్దశ పొందుతారు.

187) కూర్చునేటప్పుడు, పడుకొనేటప్పుడు, కొత్తబట్టలు కట్టుకొనేటప్పుడు, భోజనం చేసేటప్పుడు, దానం చేసేటప్పుడు, విత్తనములు చల్లేటప్పుడు, పెండ్లిలోను తుమ్ము వచ్చిన శుభప్రదము

188) జ్ఞానము - మోక్షము గురించి ఆలోచించేది.

189) విజ్ఞానము - అనేకపుస్తకములు చదివి, వాటి సారాంశములు చెప్పునది.

190) బుద్ధి - ఇతరులను గూర్చి ఆలోచించేది.

191) ఆశకు ఆవలి ఒడ్డు తృప్తి.

192) బాధ్యత అంగీకరించిన తరువాత విస్మరించరాదు. సంపూర్తి చేయుట ధర్మము.

193) తాను సంపాదించిన దానికన్నా, ఇతరులు ఇచ్చిన దానిని రక్షించుకొనడం రెండు రెట్లు కష్టము.

194) పాపాత్ముడు పాప కార్యము చేయునపుడు ఇతరులతో సంప్రదించడు.

195) త్యాగ మున్నంత వరకు మనిషిలో చావు లేదు.

196) తీర్థ యాత్ర సమయములో బ్రహ్మచర్యమును పాటించాలి.

197) యజమానికి భార్య ఎడమ వైపున, కుమారుడు కుడి వైపున ఉండవలెను.

198) స్త్రీ శ్మశానమునకు వెళ్లకూడదు. దుఃఖములో బాధపడ కూడదు. సుఖములో పొంగిపోకూడదు.

199) నగ్న స్త్రీని చూచుట దోషము.

200) పెద్ద కొడుకును తండ్రి దత్తత ఇవ్వరాదు. ( దైవ సంతానం కనుక)

201) చివరి కొడుకును దత్తత ఇవ్వరాదు. (జ్ఞాన సంతానం కనుక)

202) మధ్య వారిని దత్తత ఇవ్వవచ్చును. (కామ సంతానం కనుక)

203) పెద్ద కుమారుని చేతిలోనుండి నీళ్ళు వదలినచో పితృ దేవతలు తరింతురు.

204) కార్తీక మాసము పగలు శంకర స్వరూపము, రాత్రి నారాయణ స్వరూపము. కనుక వివాహములు చేయరాదు.

205) వేశ్య స్త్రీ, శవము, చేపలు, మండుతున్న అగ్ని, ఒక శూద్రుడు, మాంసము, నలుగురు వైశ్యులు, ఇద్దరు సువాసినులు, బిందె పట్టుకు వచ్చినవారు, ఇద్దరు బ్రాహ్మణులు - ఇవి అన్నియు శుభశకునములు.

206) అన్యాయ ప్రవృత్తిలో నడిచే వారిని స్వంత తమ్ముడు కూడ విడిచి పెడతాడు. న్యాయముగ నడిచే వారిని జంతువులు కూడా ఆదరిస్తాయి.

207) ప్రయాణమైన సమయమున పిల్లలు పోట్లాడుకొనుట, భార్య పోట్లాడుతూ సాగనంపుట, వెలుపల నున్నవారు ఎదురు వచ్చుట, నక్క, జింక, త్రాచు పాము, అకాల వర్షం, దొడ్లో పశువులు తుమ్ముట మొదలగునవి అపశకునములు.

208) మానవునికి శోకం శత్రువు. శోకం వచ్చినపుడు ధైర్యాన్ని పోగొట్టును, పైగా మంగళప్రదమైన పనులు చేయనీయదు.



209) క్రింద కాని, జల్లమీద కాని పరుండినచో కామం నశిస్తుంది. ఈ విధంగా ఐదు రోజులు చేసిన బ్రహ్మచర్యము వచ్చును.

210) వేయించిన శనగపప్పు, మరమరాలు ఇంటిలో జల్లినచో మూడు రోజులలో దయ్యము వచ్చును.

211) పూర్వజన్మ సుకృతాన్నిబట్టి విద్య, భార్య, ఐశ్వర్యము లభించును.

212) తెల్లవారుఝామున నీరు త్రాగవలెను. రాత్రులందు పాలను త్రాగవలెను.

213) మంచము మీద మరణిస్తే ముక్తి కలుగదు.

214) తన ఇంటిలో ఎవరైనా మరణిస్తే యజమాని స్వయముగా వెళ్లి పిలువకూడదు. ఇతరుల చేత కబురు పంపాలి.

215) మానవుడు అన్ని ఋణములు తీరుస్తాడు కాని ఈక్రింది ఋణములు తీర్చలేడు. ఇవి పురుషునికి మరణ సమయము వరకు ఉంటాయి. 1) ఋషి ఋణము (శిఖ) 2) దేహ ఋణము (మొల త్రాడు) 3) పితృ ఋణము (యజ్ఞోపవీతము)

216) సేవించడం వేరు. భక్తి కలిగి ఉండడం వేరు. సేవించిన వారు ఎప్పుడూ సేవలో మునిగి ఉంటారు. కాబట్టి వారికి మోక్షం కలుగుతుంది. భక్తి ఎప్పుడో ఒకప్పుడు చలిస్తుంది. కాబట్టి వారికి త్వరితంగా మోక్షం సిద్ధించదు.

217) దేహాభిమానం ఉండరాదు. ఆత్మాభిమానం ఉండాలి.

218) ఉపనయనం అయిన తర్వాత, పగలు నిద్రపోవు వారికి వచ్చు కలలు నిజమౌతాయి.

219) అన్నదమ్ములు పంచుకుంటే మార్చుకోవచ్చును. కాని తండ్రి పంచితే మార్చుకో కూడదు.

220) గొర్రెల మందల, గాడిదల మందల, మేకల మందల, భార్యా భర్తల, గురు శిష్యుల, ఇద్దరి బ్రాహ్మణుల, శివాలయములో నంది శంకరుల మధ్యనుండి వెడితే పుణ్యము రాదుకదా, పూర్వ పుణ్యం కూడా పోతుంది.

221) విష్ణువు అలంకార ప్రియుడు. సూర్యుడు నమస్కార ప్రియుడు. శివుడు అభిషేక ప్రియుడు. బ్రాహ్మణుడు భోజన ప్రియుడు. (అందరికీ హితమును కలిగించువాడు)

222) బ్రహ్మ కపాలము వెళ్లి తనకు కూడ పిండప్రదానము చేసికొన్నవాడు శుభ కార్యములకు పీటలమీద కూర్చునుటకు అనర్హుడు.

223) ద్వారానికి పైనున్న కమ్మి లక్ష్మీ స్వరూపము. అందుకే దానికి మామిడి తోరణం కట్టెదరు. క్రింద కమ్మి (మండిగం) పవిత్రమైనది. కనుక దానికి పసుపు రాసి, బొట్లు పెట్టెదరు.

224) వేదపండితులైన బ్రాహ్మణ్ణముల యింటిలో బ్రహ్మ వుంటాడు. అదే ఆయనకు గుడి. అందుకే బ్రహ్మకు వేరే గుడి అవసరము లేదు.

225) తపస్సు చేసుకునేవారు. విద్యార్థులు, పూజ చేసుకునే వారు వీపు వెనుక భాగం ఆనుకుంటే సామర్థ్యములు వుండవు.

226) జ్ఞానము, వైరాగ్యము, యశస్సు, వీర్యము, ఐశ్వర్యము ఈ ఐదింటికి "భగ" మని పేరు. ఈ ఐదు గుణములు పొందువాడు భగవంతుడు.

227) సర్వప్రాణులలోను ఆత్మరూపమున ప్రకాశించుచు స్తుతించబడుచు, సర్వవ్యాప్తమై వుండు వానిని దేవుడు అందురు. (శబ్ద కల్ప ద్రుమము.)-

228) మంగళ వాద్యములతో యిచ్చే స్వాగతము శుభప్రదము. రోపిలి వొగ్గి పిలుచుట గౌరవప్రదము.



229) మంచుపడే రోజున దూదిపింజను మంచులో పెట్టి, ఆ మరునాడు పిండితే. ఎన్ని బిందువులు వస్తే ఆ సంవత్సరములో ఆరు మాసాలకు అదేరోజున అన్ని దిక్కుల వర్షము కురియును.

230) పూజా మందిరంలో పాము కనిపిస్తే అశుభం. తేలు కనిపిస్తే ఆ యింటిలో ఐశ్వర్యముంటుంది.

231) దైవకర్మలు చేయునపుడు ఉత్తర ముఖముగా వుండి ముందు ఎడమపాదాన్ని, తరువాత కుడిపాదాన్ని కడుక్కోవాలి.

232) కాళ్ళు చేతితో కడుగు కొనవలెను. కాలిమీద కాలుపెట్టి తోమరాదు.

233) దేవతలకు స్వర్గలోకము, మనుష్యులకు మర్త్యలోకము, రాక్షసులకు పాతాళ లోకము నివాసములు.

234) చేసిన ఉపకారములు మరచేవాడు, ఇచ్చిన దానితో తృప్తి పొందనివాడు, ఇవ్వకలిగి వుండి యివ్వనివాడు పాపమును పొందుదురు.

235) ఏనుగు తొండము, కుక్కతోక, బ్రాహ్మణుడి చెయ్యి, మనస్సు నిశ్చలముగా వుండవు.

236) బ్రాహ్మణులతో భోజనము చేయుట, ఇంటిలో బంధువులు వుండుట, పక్కలో కుమారునితో నిద్రించుట వీటివలన పుణ్యము వచ్చును.

237) అసంతుష్టి వున్న బ్రాహ్మణుడు, సంతుష్టి గల ప్రభువు, సిగ్గులేని గృహిణి, సిగ్గువున్న వేశ్య నష్టపోవుదురు.

238) స్నాన, జప, హోమ, దాన, దేవపూజ, భోజన సమయములందు అంచుగల వస్త్రములు ధరించవలెను.

239) సూతకము, పురిటి స్నానము, సంక్రాంతి, శ్రాద్ధము, జన్మతిథి, చండాల స్పర్శనమున వేడినీటి స్నానము చేయరాదు.

240) ఒకరి వస్త్రములు మరియొకరు కట్టకూడదు. స్త్రీ పురుషులు వస్త్రములు మార్చుకొనరాదు.

241) కంచుపాత్రలో పాలు, కొబ్బరి నీళ్ళు మొదలగునవి త్రాగరాదు. త్రాగిన కల్లుతో సమానము.

242) పాడ్యమినాడు గుమ్మడికాయ తినరాదు.

243) తదియనాడు పొట్లకాయ తినరాదు.

244) సప్తమినాడు, ఆదివారంనాడు, రాత్రివేళలలో ఉసిరికాయ తినరాదు. (బొల్లి వచ్చును కనుక)

245) అష్టమినాడు కొబ్బరికాయ తింటే బుద్ధినాశనము.

246) దశమినాడు అనపకాయ, అష్టమి, ద్వాదశి చతుర్దశి, అమావాస్య, పౌర్ణమి రోజులలో నూనె వాడరాదు

247) విస్తరిలో తినే పదార్థములపై మాత్రమే నెయ్యి వేసుకొనవలెను. విస్తరిలో మాత్రం వేయరాదు.

248) చారు అన్నం మధ్యలోగాని, మజ్జిగ అన్నం మధ్యలో గాని, పరమాన్నం మధ్యలో గాని మంచినీరు త్రాగరాదు.

249) ఉదయం వీధిలో నుండి ఇంట్లోకి, సాయంత్రం ఇంటిలో నుండి వీధిలోని తుడిచి, నీళ్ళుచల్లి, ముగ్గు వేసుకుంటూ వెడితే అది లక్ష్మీ ప్రదము.

250) జుట్టు విదల్చరాదు.

251) స్త్రీ పురుషులకు నోరు చిన్నదిగా వుంటే తెలివి గలవారవుతారు. కళ్ళు పెద్దవిగా ఉంటే అదృష్టము. మోకాళ్లు రెండు కలిసినచోట, మోకాళ్ల మధ్య ఖాళీ ప్రదేశమువుంటే వారున్నచోట ఐశ్వర్యముంటుంది. కాలికి గాని, చేతికి గాని, ఆరు వేళ్లున్నచో ఐశ్వర్యముండదు.

252) నేలపై శబ్దం చేస్తూ నడవకూడదు. (అరిష్టం)

253) నుదురు పెద్దదిగా వుంటే జ్ఞానవంతులౌతారు.

254) నాభి లోతుగా ఉంటే అదృష్టవంతులౌతారు.



255) క్రింది పెదవి, పై పెదవి కంటె పెద్దదిగా వున్నవారు మంత్రశక్తి గలవారు అవుతారు.

256) కనుబొమ్మల మధ్య ఖాళీవున్న వారు సువాసినులుగా వుంటారు.

257) కేశములు ఎక్కువగా పెంచిన, గోళ్ళు పెంచిన దేహం పాప భూయిష్టమౌతుంది.

258) పూర్వజన్మలో చేసినవాటిని బట్టి లభిస్తాయి.

1) విద్యాదానం చేసిన - విద్య
2) దానం చేసిన - ఐశ్వర్యము
3) పురుషుడు చేసిన పూజనుబట్టి - భార్య

259) ఈ క్రిందివారు పాతకులు :

1) సత్రములు కట్టిస్తానని, దేవాలయాలు కట్టిస్తానని సొమ్ము వసూలు చేసి తినివేయువాడు.

2) తన తెలివి వల్ల శాస్త్రానికి అర్థము వేరుగా చెప్పువాడు.

3) గురువును గౌరవించనివాడు.

4) మిత్రునికి ద్రోహం చేయువాడు.

5) విన్న దానిని గురించి ముందర బాగానేవుంది. తరువాత విమర్శించువాడు.

6) సంతానం కలిగే భార్యను చేసికొని, సంతానం కలుగకుండా చేయువాడు.

7) భార్యా పిల్లలను చూడకుండా, యితరులను చూచువాడు.

8) నమ్మినవారికి ద్రోహము చేయువాడు.

9) యుద్ధములో వీపును చూపిన వానిని చంపువాడు.

10) కపాలం పట్టుకొని అడుక్కున్న వాని యొద్ద బియ్యం కొనుక్కునేవాడు.

11) ఎంతో డబ్బు గడించి, అందరికి యిచ్చి బ్రాహ్మణులకు యివ్వనివాడు.

12) తన యింటికి తానే నిప్పంటించుకొనువాడు.

13) గురువుగారు పరుండిన మంచముపై పరుండువాడు.

14) దేవతలకు, పితృదేవతలకు సేవచేయనివాడు.

15) జీవితంలో ఒకసారైనా కాశీ చూడనివాడు.

16) ఆశ వుంచి చేయనివాడు.

17) స్త్రీకి యథార్థం చెప్పకుండా అనుభవించువాడు.

18) నీళ్ళలో మందు కలుపువాడు.

19) తినేవాడి నోటినుండి అన్నం తీయువాడు.

20) త్రాగేవాడి నోటినుండి మంచినీరు తీయువాడు.

21) పడుకున్న ఆవును తన్నువాడు.

22) పాయసం పారవేయువాడు.

23) ఆవు ఈనిన 11 రోజుల లోపల పాలు తీయువాడు.

260) అష్టకష్టములు: దాసీత్వము, దరిద్రము, భార్య లేకపోవటము, ప్రతిపని తానే చేసుకోవటం, అప్పు ఎక్కువ ఉండడం, అసలు లేకపోవటం, అప్పుల పాలవడం, ప్రతిరోజు నడవటం.

261) ఈషణాత్రయము : భార్యమీద ఆశ, పుత్రుని మీద ఆశ, ధనము మీద ఆశ ఈ మూడు మానవునికి ఉండును.

262) దాచవలసినవి : వయస్సు, విత్తము, మంత్రము, గృహచ్ఛిద్రము, ఔషధము, సంగమము, దానము, మానము, అవమానము.

263) పంచ సౌగంధికములు : యాలకులు, జాపత్రి, జాజికాయ, దాల్చిన చెక్క, లవంగములు.



264) గంధాదిక పంచకములు : గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము. ఇవిలేని పూజ నిష్ఫలము.

265) దేవతా వృక్షములు : మందారము, పారిజాతము.

266) సంతాన కల్పవృక్షములు : అరటి, రావి చెట్లు.

267) పతివ్రతలు : అహల్య, ద్రౌపది, సీత, తార (బృహస్పతి భార్య), మండోదరి.

268) లోకములు : మనుష్య లోకము, పితృ లోకము, దేవ లోకము.

మనుష్య లోకము: పుత్రునిచే జయించ దగినది. అనగా పుత్రుని వలన సుఖము పొందవచ్చును.

పితృ లోకము: కర్మలచే పితృలోక సుఖము పొందవచ్చును.

దేవ లోకము: జ్ఞాన సహిత కర్మలచేత దేవలోక సుఖమును పొందవచ్చును.

269) నవవిధ భక్తులు : శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవ, అర్చన, నమస్కారము, దాస్యము, సఖిత్వము, ఆత్మ నివేదనము.

270) తపస్సులు : మానసిక తపస్సు, శారీరక తపస్సు, వాక్ తపస్సు, వేదాంత తపస్సు.

271) దృష్టి నాలుగు రకములు : ప్రసన్న దృష్టి, ప్రసారిత దృష్టి, సంకుచిత దృష్టి, ఆనంద దృష్టి.

272) చాలా పూజలు చేస్తూ ఉండి, భర్తను పూజించని స్త్రీ పాతకురాలగును.

273) గేదెతో గానీ, దున్నపోతుతో గాని పొడిపించుకుంటే వాటి పాపం మనకు అంటుకుంటుంది.

274) ఉత్తరేణి, రావి, మారేడు, పుల్లలను కాల్చి ఆ విభూదిని పెట్టుకుంటే సమస్త భూత పిశాచములు ఆవహించవు.

275) యుద్ధము, శృంగారము, బీభత్సము సభాముఖముగా వర్ణించ కూడదు.

276) నాశనము లేనివి అక్షతలు, నాశనము లేనటువంటిది అశ్వత్థ వృక్షము.

277) వైశ్వ దేవము చేస్తే పురుషునికి ఎంత పుణ్యమో, రెండు బియ్యపు గింజలు పొయ్యిలో వేస్తే స్త్రీలకు అంత పుణ్యము. కనుకనే పొయ్యిలో బియ్యపు గింజలు వేస్తారు స్త్రీలు.

278) జ్ఞానము చేత బ్రాహ్మణులు, ఎక్కువ బలము చేత క్షత్రియులు, ధనము చేత వైశ్యులు, వయస్సు చేత ఇతరులు పెద్దలగుదురు.

279) పాలలో బియ్యము వేసి వండినది పరమాన్నము.

280) ఫాలభాగము వెడల్పుగా కలవారు, చెవులు క్రిందికి ఉండువారు జ్ఞానవంతులు.

281) కాళ్ళు కడుగుకొనుటకు ఇచ్చిన నీరు, త్రాగుటకు ఇచ్చిన నీరు కొంచెము మిగిల్చినచో వారు డబ్బును మిగుల్చుదురు.

282) ఒక దానము పుచ్చుకొనుట వలన దోషము ఎక్కువగా ఉంటుంది. ఎక్కువ దానములు పుచ్చుకుంటే దోషము తక్కువగా ఉంటుంది.

283) చారీచాలని త్రాడుతో బావిలో నీళ్లపై బొక్కెనతో కొట్టరాదు. ఆలా కొట్టితే ఐశ్వర్యముండదు. పెద్ద త్రాటిని ఉపయోగించవలెను.

284) 8 రెప్ప పాట్లు ఒక కాష్ఠ 80 కాష్ఠలు ఒక కళ, 30 కళలు ఒక క్షణము, 12 క్షణములు ఒక ముహూర్తము.

285) దేవతా పూజా సమయమందు, పూజ అయిన తరువాత, బ్రాహ్మ ముహూర్త సమయమందు అన్న మాటలు జరుగును. ధూపం లేకుండా పూజ పనికి రాదు. ఇంటిలో పూజకు అగరు పుల్లలు, ప్రత్యేక పూజకు సాంబ్రాణి, గ్రామ దేవతలకు గుగ్గిలము పొగ వేయవలెను.

286) దేవాలయమునకు వెనుక భాగమున రాక్షసులు ఉంటారు. అందుచే ఆలయము వెనుక భాగము తాకరాదు. ఆలయానికి గజం వదలి ప్రదక్షిణం చేయాలి.



287) జీవుడు ముందు జన్మలో రాయిగా పుడతాడు. శిలా జన్మలో చివరది సాలగ్రామం. ఈ సాలగ్రామంలో 120 జాతులు. జీవుడి తరువాత జన్మ వృక్షము. చివరది అశ్వత్థము. తరువాత పక్షులు. చివరగ గరుత్మంతుడు. తరువాత జన్మ నాలుగు కాళ్ల జంతువు. జంతువులలో చివరది గో జన్మ. తరువాతది మానవ జన్మ. ఈ జన్మ దాటితే దైవ జన్మ. తరువాత తిరిగి దేహం పొందకుండా ఉండుటకు మహర్షులు నక్షత్రములవలె ఆకాశమున తపస్సు చేస్తూఉందురు. అందొక చుక్క గానినే తిరిగి జన్మ ఉండదు.

288) తాంబూలం తరువాత కూడా ఆచమనము చేయించవలెను.

289) బ్రాహ్మణ స్త్రీ మూడు వరములు, క్షత్రియ స్త్రీ రెండు వరములు, వైశ్య స్త్రీ ఒక వరము, శూద్ర స్త్రీ మూడు వరములు అడుగవచ్చును.

290) కట్టిన బట్టను పైన వేసుకొనరాదు.

291) విరుగుడు మజ్జిగ త్రాగినచో తిరిగి ఒడుగు చేసుకొనవలెను.

292) వేలిని నాకరాదు. ఎంగిలి విస్తరిలో నెయ్యి వేసుకొనరాదు. పీటకు ఇనుప మేకులు పనికిరావు.

293) తులసి మొక్కలో నీరు పోసి, స్త్రీ పురుషులు అందరూ చల్లుకోవలెను.

294) ఏడు రోజులు వరుసగా నూతి నీళ్లుగాని, వేడి నీళ్ల గాని స్నానము చేయరాదు. అశుభము.

295) మిత్రుడు సింహ ద్వారము నుండి రావలెను. శత్రువు అడ్డ దారిన రావచ్చును.

296) సృష్టిలో నెమలి మాత్రమే మగనెమలి కలయిక లేకుండా సంతానోత్పత్తి జరుపుకుంటుంది.

297) తీర్థం శివ స్వరూపం. ప్రసాదం విష్ణు స్వరూపం.

298) స్త్రీ, కుక్క, కోడి, పాల పిట్ట ఎడమ వైపునుండి ఎదురు వస్తే మంచిది.

299) సూర్యాస్తమయం అయ్యాక పురుషసూక్తం పారాయణ చేయకూడదు. శ్రీ సూక్తం పారాయణ చేయాలి.

300) సంపాదించేటప్పుడు శాశ్వత మనుకోవాలి. దానం చేసేటప్పుడు ఉండదని చేయాలి.

301) అన్నం ఉడికేటపుడు మాట్లాడగూడదు.

302) శివునికి తెల్ల అక్షతలు వాడవచ్చును. ఇతరమైన వారికి పసుపువి వాడవచ్చును. శక్తులకు, స్త్రీ దేవతలకు కుంకుమాక్షతలు వాడవలెను.

303) ముందు గడ్డం చేయించుకొని తర్వాత క్రాపు చేయించుకోవాలి. దక్షిణవైపునకు కూర్చుని మంగలిని మాట్లాడిస్తూ వుండాలి. మంగలి షాపునకు వెళ్ళి క్రాపు చేయించుకోగూడదు. పాడ్యమి ధననాశనం, నవమి ధాన్యనాశనము, చవితినాడు తల్లి ఉన్నవారు, షష్టినాడు అన్నదమ్ములున్నవారు, దశమినాడు కొడుకులున్నవారు, పర్వదినములందు (సంక్రమణ దినం) ఏకాదశి, బహుళ అష్టమి, చతుర్దశి, పౌర్ణమి, (అమావాస్య) తండ్రి ఉన్నవారు చేయించుకోగూడదు. వారంలో మంగళవారం పనికిరాదు. 12 గం॥ దాటాకను, భోజనమయినాక పనికిరాదు.

304) పారాణి వత్తి చేతితో ఇవ్వరాదు. పువ్వుగాని అక్షతలు గాని చేతపట్టుకొని ఇవ్వాలి.

305) ఒక నిండు ప్రాణాన్ని బ్రతికించటం కోసం ఏ తప్పు చేసినా పాపం అంటదు.

306) కుక్క, పాము కరచినట్లు కలవస్తే శుభం. పాము కలలోకి వస్తే అశుభం.



307) నలిపి నలిపి బట్టకట్టరాదు. పంచెమార్చి తిప్పి కట్టరాదు. తడిపేవరకు గుర్తుల ప్రకారం కట్టుకోవాలి.

308) మధ్య వేలితో పళ్ళు తోముకోవాలి.

309) మనం తిని ఒకరికి పెట్టడంవల్ల ఐశ్వర్యము కలుగుతుంది.

310) తడికాళ్ళతో నడిచినప్పుడు పాదముల గుర్తుపూర్తిగా నేలమీద పడాలి.

311) మినుములు ఎక్కువ తింటే మేధాశక్తి నశిస్తుంది.

312) మూడు అపశకునములు ఒక శుభశకునము.

313) సృష్టిలో నిద్ర పట్టనివారు ముగ్గురు :

1) పరాయి సొమ్ము తిందామనేవారు (దొంగలు)

2) పరాయివాడు చంపుతాడనే భయంగలవాడు.

3) పర భార్యను మోహించినవాడు.

314) స్త్రీలు ఒక గాజుతో ఉండరాదు.

315) చెవులకు, ముక్కులకు ఆభరణములు లేకుండా ఏ స్త్రీని (భార్యను కూడా) చూడరాదు.

316) తల్లిదండ్రులు చనిపోయేటప్పుడు కొడుకు వారి తలను తొడపై పెట్టుకోవలెను. మిగిలినవారు భగవత్ సంకీర్తన చేయవలెను.



# దైవ ధర్మములు

1) ఆచమనం చేయునపుడు (చేతిలో నీరు త్రాగునపుడు) చప్పుడు కారాదు. చప్పుడు అయినచో రక్తముతో సమానము.

2) ఆచమనం చేయునపుడు, మంచినీటిని త్రాగునపుడు క్రింది పెదవికి తగులునట్లు చేయవలెను. అది అమృత సమానము. పంటికి తగుల రాదు. పంటికి తగిలినచో రక్తసమానము.

3) ఆచమనం చేయునపుడు మూడు పర్యాయములు ఎప్పటికప్పుడు చేతిలో నీళ్ళు పోసుకోవలెను. ఒకసారి పోసుకొని ముమ్మారు త్రాగరాదు. అట్లు త్రాగిన ఎంగిలితో సమానము.

4) ఆచమనం చేయువారికి రాగిదికాని, బంగారపుది కాని, వెండిదికాని, దర్భదిగాని ఉంగరము తప్పక ఉండాలి. లేనిచో రక్తసమానము.

5) ఆచమనంచేసి, కేశవనామములు పూర్తికాగానే గంట మ్రోగించవలెను. ఘంటానాదం దేవతలకు పిలుపు. శంఖారావము జయమునకు పిలుపు. ధనుష్టంకారము యుద్ధమునకు పిలుపు. బిందెలు మ్రోగించిన దెయ్యాలకు పిలుపు.

6) దక్షిణ(కుడి) హస్తాదియందు బ్రహ్మతీర్థము. హస్తాగ్రమందు దేవతీర్థము. హస్త వామః పార్శ్వమందు ఋషి తీర్థము, హస్త దక్షిణ పార్శ్వమందు పితృతీర్థము, హస్తమధ్యమందు అగ్ని తీర్థము వసించియుండును. కావున బ్రహ్మ తీర్థము చేతనే ఆచమనం చేయవలెను.

7) వస్త్రమును నాలుగు మడతలుగా ఎడమచేతి యందు వుంచి, దానిపై కుడిచేతినుంచి, పవిత్రమైన తీర్థమును మూడుసార్లు, ఒక్కచుక్కనైనా క్రింద పడనీయకుండా పుచ్చుకొనవలయును. తీర్థము బ్రహ్మహత్యాది పాతకములను నశింప చేయును. ఒక్కచుక్క క్రిందపడిన అంతకు ఎనిమిది రెట్లు పాపం వచ్చును.



8) తీర్థము తాను ముందుగా పుచ్చుకొని, తర్వాత మిగతా వారికి ముమ్మారు ఇవ్వవలయును.

9) తీర్థము మూడుసార్లుగా తీసుకొనుటకు కారణము

1) ఆధ్యాత్మికము 2) ఆధిభౌతికము 3) ఆధిదైవికము

10) ఆలయములో నిలబడి, ఇంట్లో కూర్చుని తీర్థము తీసికొనవలయును.

11) తీర్థము త్రాగిన తర్వాత ఆ చేతిని శిరస్సుమీద రాసుకొనరాదు. బట్టను తుడువవలెను. (ఉచ్ఛిష్టము కనుక)

12) పూజా సమయమున దీపారాధన లౌకికాగ్నితో (అగ్గిపుల్లతో) చేయరాదు. ఇంకొక జ్యోతినికాని అగరవత్తిని గాని వెలిగించి, దానితో దీపారాధన చేయవలెను.

13) దీపారాధన చేయగానే అక్షతలుగాని, కుంకుమగాని, పుష్పలుగాని దీపంకుంది మొదట్లో వుంచవలెను.

14) ఒక దీపం కుందిలో రెండు జ్యోతులు (దీపములు)కు తక్కువ కాకుండా వుంచవలెను. ఒక దీపం అశుభము.

15) దీపారాధన ఆవునేతితో ఈశ్వర ప్రీతి, నూనెతో విష్ణుప్రీతి, శ్రీ దేవతలకు కూడా పనికి వచ్చును.

16) దీపారాధన శివునికి ఎడమవైపు, విష్ణువునకు కుడివైపు చేయవలెను. మిగిలినవారికి ఎట్లైనా చేయవచ్చును. ఎదురుగా మాత్రము చేయరాదు. (స్వామి దృష్టికి అడ్డు కనుక.)

17) ఉదయం దీపారాధన ఎంత పుణ్యమో, సాయం కాలము దీపారాధన అంతకన్నా పుణ్యం. కావున రెండు సమయములలోనూ దీపారాధన చేయవలెను.

18) ఇంట్లో ఎవరికైనా ఎక్కువ జబ్బుగా వున్నపుడు మూడు కులాల (రంగుల) దారం ఏడు పేటల వత్తిగా చేసి, మట్టిప్రమిదిలో వేసి, నెయ్యి, నూనె, ఆముదము కలిపిపోసి దీపారాధన చేసిన అపమృత్యు దోషము పోవును.

19) ఆవునేతి దీపారాధన జ్ఞానసిద్ధి, అంతమందు మోక్షము; నువ్వులనూనె దీపారాధన సంపదవృద్ధి, కీర్తియు కలుగచేయును.

20) ఆముదము, వేపనూనె, అవనూనె, అవిసెనూనె మొదలగు తైలములతో శివుని పూజించు సమయమున దీపారాధన చేయకూడదు.

21) అఖండ దీపారాధన :

7 అం॥ ఎత్తున పెట్టడం ఉత్తమము

8 అం॥ ఎత్తున పెట్టడం మధ్యమము

1 అం॥ ఎత్తున పెట్టడం అధమము.

22) పూజ ఆలస్యంగా చేసినా, సూర్యోదయమునకు ముందుగానే ముందురోజు వాడాకు పువ్వులు మొదలగునవి (నిర్మాల్యం) తీసివేయవలెను. లేనిచో ఐశ్వర్యముండదు.

23) అర్చనకు పూజా ద్రవ్యములు తన దక్షిణభాగమున (కుడి వైపు) వుంచవలెను. ఎడమ చేతితో గ్రహించరాదు. (మూఢ్యము కనుక)

24) స్త్రీలు సామానులలో పూజా ద్రవ్యములు వుంచకూడదు. భోజనం చేయు కంచాలలో అక్షతలు కలుపుట, పూజా ద్రవ్యములు వుంచుట చేయరాదు. (ఉచ్ఛిష్టము కనుక)

25) ఎర్రమందారములు స్త్రీ పురుషమూర్తుల పూజకు పనికి వచ్చును. మిగతా ఏ ఎర్రని పూవులు పురుష దేవతామూర్తుల పూజకు పనికిరావు.

26) వాసనలేని పువ్వులుతప్ప మిగతా అన్నిపువ్వులు స్త్రీ దేవతా మూర్తుల పూజకు పనికి వచ్చును.



27) ఏ రోజు కోసిన పువ్వులు ఆరోజే పూజ చేయవలెను. అక్షతలు ఏరోజు చేసినవి ఆరోజే వాడవలెను.

28) పువ్వులు లేని చెట్టును చూడరాదు. కావున చెట్టుయొక్క మొత్తం పువ్వులు కోసివేయరాదు.

29) పరుల చెట్ల పువ్వులుకోసి పూజించినచో, పూజా ఫలము చెట్లు కలవారికే దక్కును.

30) బజారులో కొన్న నిలవ పువ్వులు పూజకు పనికి రావు. పూజకు తెచ్చిన పదార్థములు దేవునికి వినియోగించకుండా ఎవ్వరికి యివ్వరాదు.

31) పుష్పముల తొడిమి త్రుంచవలెను. ముచ్చిక తీయరాదు. )విడిపోవును కనుక పూజకు పనికిరాదు.)

32) ధర్మమార్గమున సంపాదించిన ధనమిచ్చి కొన్న పుష్పములతో దేవపూజ చేసినవాడు తన పూర్వులను ఏడు తరముల వారిని, తన తరువాత ఏడు తరముల వారిని తరియింపచేయును. (విష్ణు ధర్మోత్తరము)

33) భగవంతుని పూజకు "తులసి" అతి ప్రశస్తము. పవిత్ర దినములలో తులసి కోయరాదు. గోర్లతో త్రుంచరాదు. సూర్యాస్తమయము తర్వాత కోయరాదు. (తులసి సన్నిధానమందు విష్ణుమూర్తి ఏకాంతముగ వుండును కనుక) స్త్రీలు దళములు కోయరాదు. పురుషులు మాత్రమే కోయవలెను. పెంచుటయు, పోషించుటయు స్త్రీలు చేయవచ్చును.

34) ఆషాఢ శుద్ధ ఏకాదశి నుండి, కార్తీక శుద్ధ పౌర్ణమివరకు చాతుర్మాస్య దీక్ష కావున, ఆ సమయములో "తులసి" మొక్కను చోటును మార్చి పాతరాదు.

35) తులసి దళములు కోయునపుడు ఈ శ్లోకములను చదువవలెను:

శ్లో॥ తులస్యమృత సంభూతే! సదా త్వం కేశవప్రియే
కేశవార్థం లునామి త్వాం వరదా భవ శోభనే॥
ప్రసీద మమ దేవీ త్వం ప్రసీద హరివల్లభే
క్షీరోద మథనోద్భూతే తులసి త్వం ప్రసీద మే॥

(పాల సముద్రమును తరచినపుడు పుట్టిన ఓ తులసీ! నన్ను అనుగ్రహింపుము.)

36) కోసిన లగాయతు తులసి ఒక సంవత్సరము, మారేడు మూడు సంవత్సరములు, తామరపూలు ఏడురోజుల వరకు పూజకు పనికివచ్చును.

37) ఇంటిలో పూజించు విగ్రహములు (లోహములవి) పాదములు లగాయతు శిరస్సు వరకు రెండు లేక మూడు అంగుళములు ఎత్తు మాత్రమే వుండవలెను. లేనిచో యజమాని భరించలేడు. విగ్రహమునకు కళ్ళు, చెవులు, ముక్కు, నోరు అరిగిపోకుండా శుభ్రముగా వుండవలెను. పటమునకు అట్టి నిబంధనలు లేవు. ముఖముమీగ పురుగులు తినిన పనికిరాదు.

38) నామములతో పూజ చేయునపుడు "ఓం"కారము నామమునకు ముందు చేర్చవలెను. కుంకుమ ముఖము మీద పడునటుల పూజించరాదు.

39) లక్ష్మి దేవిని, సరస్వతీదేవిని ఆవాహన చేసుకోవాలిగాని, ఉద్వాసన చెప్పరాదు.

40) వినాయక చవితినాడు విఘ్నేశ్వర పూజ చేయునప్పుడు సరస్వతిని (పుస్తకములను) కుడివైపు వుంచాలి. ఇది ఆచారమును బట్టి యుండును.

41) దేవునికిచ్చిన కర్పూర నీరాజనము కళ్ళకద్దుకొని చేతులను వాసన చూచిన తర్వాత శిరస్సుపై పెట్టుకోవలెను.



42) చామరము (చామరీ మృగము యొక్క వెంట్రుకలతో చేయబడినవి.) ఎదురుగా యివ్వకూడదు. తలక్రిందులుగా పడి చేతికి ఇవ్వాలి.

43) ఒట్టి నేలమీద కూర్చుని పూజ చేయరాదు. దర్భాసనంగాని, లేడి చర్మంగాని, నూతన వస్త్రంగాని వేసుకొని కూర్చొనవలెను.

| | |
|---|---|
| వెదురు ఆసనమున కూర్చుండిన | దరిద్రము |
| రాతిమీద | వ్యాధి |
| నేలమీద | దుఃఖము |
| కుశాసనమున | పౌష్టికము |
| కొయ్యమీద | దౌర్భాగ్యం |
| తృణాసనమున | యశోహాని |
| చిగురుటాకులమీద | చిత్తభ్రమణము |
| కంబళాసనమున | దుఃఖవిమోచనము |
| నీలముగు ఆసనమున | అభిచారము |
| ఎఱ్ఱని ఆసనమున | వశ్యాదికము |
| చిత్రాసనమున | సర్వార్థములు |
| తెల్లని ఆసనమున | శాంతి |
| కృష్ణాజినమున | జ్ఞానసిద్ధి |
| పులిచర్మమున | మోక్షసిద్ధి కలుగును. |

ఏ ఆసనము లేకుండినను ఒక దర్భనైనా వేసుకొని కూర్చొనవలెను.

44) కొబ్బరిబొండం జటాజూటముతో కూడిన శివుని శిరస్సుతో సమానము. శివుని శిరస్సు శుభం కనుక కొబ్బరికాయ కొట్టి పని ప్రారంభించటం శుభప్రదం. కొబ్బరికాయ కొట్టునపుడు పీచు ఎడమవైపునకు వుండవలెను. కొబ్బరి కాయకు బొట్టుపెట్టుట కూడా ఆచారములో వున్నది. కాయ నేల మీద కొట్టుట శ్రేష్ఠము. 'శ్రీ చక్రం' వున్న చోట కొబ్బరికాయ కొట్టరాదు.

45) పచ్చని పట్టుబట్ట (పీతాంబరం) పూజకు మంగళప్రదము. తెల్లని పట్టుబట్ట శుభప్రదము. ఎర్రని పట్టుబట్ట కోపకారణము. ఏకరంగు బట్ట ధైర్యము, మానసిక స్థిరత్వమును, రంగులవి, బొమ్మలవి మానసిక చాంచల్యమును సూచించును. స్త్రీలకు రంగులవి, బొమ్మలవి పనికి వచ్చును. పట్టు శరీరములోని ప్రాణశక్తిని పోనీయదు. అంచు కలవి ధరించవలెను. దీనికన్నా నారపట్టు మంచిది. దీనికన్నా ఉత్తమమైనది ధావళి. దీనికి ఎట్టి అశౌచ దోషములు లేవు.

46) పట్టుబట్ట కట్టుకొని ఒకసారి భోజనం చేసిన ఆ బట్ట పూజకు పనికిరాదు.

47) తడిబట్టతో ఎట్టి శుభకార్యములుగాని, క్షురకర్మకాని చేసుకొనరాదు. (అశుభం కనుక)

48) పంచామృత స్నానం, శుద్ధోదక స్నానం చేయించిన తర్వాత ఆచమనం చేయించవలెను.

49) అవసర నైవేద్యమునకు పంచదార పనికిరాదు. బెల్లం పనికివచ్చును.

50) మహా నివేదన వండిన గిన్నెలోనే పెట్టవలెను. వేరే పళ్లెములో పెట్టరాదు. (స్వామి వారికి భోజనం చాలదు కనుక) మంచి నీళ్లు కూడా పెట్టవలెను. నైవేద్యము దక్షిణ భాగమున (తన కుడి వైపు) ఉంచవలెను.

51) శివ నైవేద్యమందును, విష్ణు నైవేద్యమందును ఎవ్వరూ భేదము చూపరాదు.

52) తమలపాకులు 5, 7, 10, 12 మంచిది.

53) ఒక వక్క తాంబూలములో పెట్టిన ఆరోగ్యప్రదము.
రెండు వక్కలు " " నిష్ఫలము
మూడు వక్కలు - " " సర్వదా క్షేమము



54) నవ మాసములు నిండిన గర్భవతి నీళ్ల బిందెను భుజంమీద పెట్టుకొని ఎంత జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకొంటూ నెమ్మదిగా నడచునో, అదే విధంగా భగవంతునికి భక్తులు నెమ్మదిగా భక్తి శ్రద్ధలతో ఆలయము చుట్టూ ప్రదక్షిణ సవ్యముగా మూడు సార్లు చేయవలెను.

55) నందికి ఏ ప్రక్కనుంచి లోపలకు వెళ్లెదరో, ఆ ప్రక్కనుంచి మాత్రమే వెనుకకు రావలెను. శివలింగం, నందీశ్వరుల మధ్య నుంచి రాకూడదు. అలా వచ్చిన పుణ్యం రాదు సరికదా, పూర్వ జన్మలోని పుణ్యంకూడా పోవును.

56) శివాలయంలో నందీశ్వరుని ప్రార్థించిన తర్వాత మాత్రమే స్వామివారిని దర్శించడానికి వెళ్లవలెను. నందీశ్వరుని అనుమతి లేనిదే శివపూజ చేయకూడదు. అలా చేసినచో ఫలితముండదు.

## నందీశ్వర ప్రార్థన

శ్లో॥ నందీశ్వర నమస్తుభ్యం శాంతానంద ప్రదాయకం
మహాదేవేశ సేవార్థం అనుజ్ఞాం దాతుమర్హసి॥

57) నందీశ్వరుని శృంగములు (కొమ్ములు) మధ్యనుండి శంకరుని చూస్తూ, "ఓం హర, ఓం హర, ఓం హర" అని పలుకుచు, శంకరుని దర్శించినచో పదక్రమ సహితముగా వేదాంగములతో వేదములను పఠించిన ఫలమున్నూ, ఏడు కోట్ల మహా మంత్రములను జపించిన ఫలమున్నూ పొంది, సర్వ పాపములచేత విడువబడినవాడై అంత్యమందు శివ సాయుజ్యమును పొందును. శివ దర్శన పుణ్యము కలుగును.

58) నందీశ్వరుని కొమ్ములమీద ఎడమచేయి ఉంచి, వెనుక భాగమున కుడి చేయి ఉంచి స్పృశించినచో శిరస్సు వంచును కనుక శివుడు పశుపతి కనుక. తనలోని పశుత్వము సంహరించుకున్నానని

చెప్పుట. 'సోహం' అనే టూగుటుయ్యాలలో ఈశ్వరుడు ఊగుచుండును కనుక, నందిమీద నుండి పైన చెప్పిన విధముగా చూచినప్పుడు, నందికి ఉచ్ఛ్వాస నిశ్వాసలు ఆగి శివ దర్శన భాగ్యము కలుగును.

59) యతులకు అపసవ్యముగాను, బ్రహ్మచారులకు సవ్యముగాను, గృహస్థులకు సవ్యాపసవ్యములుగాను శివ ప్రదక్షిణము విధింపబడినది.

60) శివాలయమునకు ఉత్తమోత్తమమైన ప్రదక్షిణము చండ ప్రదక్షిణము. శివునికి ప్రదక్షిణము వేయునప్పుడు సోమసూత్రము దాటరాదు. అలా దాటి చేసిన ఏ ప్రదక్షిణ అయినను ఒకటియే సంఖ్యలోనికి వచ్చును. చండ ప్రదక్షిణము ఒక సారి చేసిన, 30 వేల సార్లు ప్రదక్షిణ చేసిన ఫలం వచ్చును.






శ్లో॥ చండస్థానేతు సంకల్ప్య వృషా దౌ ప్రదక్షిణం
వృషం చండం వృషంచైవ, సోమ సూత్రం పునర్వృషం
చండం చ సోమసూత్రం చ, పునశ్చండం పునర్వృషం
నవప్రదక్షిణోపేతం, యఃకుర్యాచ్ఛ ప్రదక్షిణం
త్రింశత్సహస్రసం సంఖ్యాక, ప్రదక్షిణ ఫలం లభేత్॥

చండీశ్వరుడున్న చోటునుండి అనగా (చండీశ్వరుడు లేకున్నను) శివాభిషేక జలము బైటకువచ్చు సోమసూత్రం నుంచి ప్రారంభించి, ధ్వజం వద్దకు, ధ్వజం నుండి తిరిగి ప్రదక్షిణముగా సోమసూత్రము వద్దకు, 2) అక్కడనుండి వెనుకకు తిరిగి ధ్వజం వద్దకు, 3) ధ్వజం నుండి ముందుకు సోమసూత్రం వద్దకు 4) తిరిగి వెనుకకు ధ్వజం వద్దకు, 5) ధ్వజం నుంచి ముందుకు సోమసూత్రం వద్దకు, 6) తిరిగి సోమసూత్రం నుంచి వెనుకకు ధ్వజం వద్దకు, 7) ధ్వజం నుంచి ముందుకు సోమసూత్రం వద్దకు, 8) సోమసూత్రం నుంచి ధ్వజం వద్దకు, 9) అక్కడ నుంచి, శివాలయంలోకి ధ్వజం ఎడమ ప్రక్క నుండి వెళ్ళవలెను. దీనిని చండ ప్రదక్షిణమందురు.

ఇది ఒక్కటి చేస్తే శివునికి 30 వేల ప్రదక్షిణములు చేసినంత పుణ్యము. రెండవ ప్రదక్షిణములో ధ్వజమును ముట్టుకోరాదు.

61) రెండు సోమసూత్రములు వున్న యెడల ఈ ప్రదక్షిణలు పనికిరావు.

62) దేవాలయము నుండి బయటకు వచ్చునపుడు వెనుకకు తిరిగి రాకూడదు. ప్రక్కగా నడుస్తూ రావలెను. (వీపు కనబడకూడదు కనుక)

63) రుద్రాక్ష మహాత్మ్యము :

ఒకప్పుడు త్రిపురుడు అనే రాక్షసుడు బ్రహ్మాదులను దేవతలను జయించి వారిని స్థానభ్రష్టులను చేయగా వారందరూ వచ్చి శంకరునితో

తమ బారలు చెప్పుకొని త్రిపుర సంహారం చేసి కాపాడవలసినదిగా కోరినారు. అంతట శంకరుడు "అఘోరము" అనే దివ్యాస్త్రమును రూపొందించాలని సంకల్పించి చిరకాలం ధ్యానముద్రను ధరించాడు. అలాగు దేవమానం ప్రకారం వెయ్యి సంవత్సరాలు ధ్యానించి కనులను తెరిచాడు. వెంటనే శంకరుని కనులనుంచి బాష్ప బిందువులు జలజల రాలాయి. అప్పటికప్పుడవి మొలకలెత్తి పెద్దచెట్లుగా పెరిగాయి. అవే రుద్రావృక్షాలు.(రుద్రుని అక్షుల జలము నుంచి పుట్టినవి కనుక రుద్రాక్షలు అని పేరు పొందినవి.)

శివునకు కన్నులు మూడు. సూర్యుడు ఒకకన్ను, దాని నుండి పుట్టినవి కపిలవర్ణములో ఉంటాయి. అవి పన్నెండు విధములు. చంద్రుడు ఒక కన్ను, దాని నుండి పుట్టినవి తెల్లగా ఉండి పదహారు విధములు. అగ్ని మూడవకన్ను, దాని నుండి పుట్టినవి నల్లగా ఉంటాయి. అవి పది విధాలు. (మొత్తం రుద్రాక్షలు ముప్పై ఎనిమిది విధములు)

తెలుపు సాత్వికమునకు, ఎరుపు రాజసమునకు, నలుపు తామసమునకు చిహ్నాలు.

ఏకముఖి రుద్రస్వరూపము ధరిస్తే బ్రహ్మహత్యా దోషమును పోగొట్టుతుంది. (పరతత్వజ్ఞానం కలుగుతుంది.) ద్విముఖి అర్ధనారీశ్వరము పాపహరము, త్రిముఖము అగ్ని రూపము స్త్రీ హత్యాపాపహరం. చతుర్ముఖము బ్రహ్మాత్మకము నరహత్య పాపనాశకము. పంచముఖి కాలాగ్ని రుద్రాత్మకము సర్వదోషహరము. షణ్ముఖినీరూపము. (స్కందాత్మకము) దానిని కుడిచేత ధరిస్తే బ్రహ్మహత్యాది మహాపాతకాలను భస్మం చేస్తుంది. సప్త ముఖము అనంగాత్మకము బంగారం దొంగిలించడం మొదలైన పాపపు పనులవల్ల వచ్చే పాపములను పోగొడుతుంది. అష్టముఖం వినాయకాత్మకం. గురుద్రోహాదుల వల్ల కలిగే పాపాలను దూరీకరిస్తుంది. నవముఖం భైరవాత్మకం. దీనిని ఎడమభుజాన ధరిస్తే భుక్తి ముక్తి కలుగుతాయి. బ్రహ్మహత్యాది పాతకాలు పోతాయి. శంకరునితో సమాన బలశాలి అవుతాడు. దశ ముఖం జనార్ధనాత్మకం. భూత భేతాళాద్యుపద్రవాలు పోగొట్టుతుంది.



ఏకాదశ ముఖం ఏకాదశ రుద్రాత్మకం. దీనిని శిఖపై ధరిస్తే అశ్వమేధ ఫలం వస్తుంది. ద్వాదశ ముఖం ద్వాదశసూర్యాత్మకం. ద్వాదశాదిత్యుల అనుగ్రహం కలిగిస్తుంది. పశువులను చంపడంవల్ల వచ్చే పాపమును పోగొట్టుతుంది. పదమూడు ముఖములున్న రుద్రాక్ష సామాన్యముగా లభించదు. అది కార్తికేయాంశము. సర్వార్థసిద్ధిప్రదం అవుతుంది. పద్నాల్గు ముఖాలు గలది కూడా దొరకదు. దొరికితే దానిని సర్వదా శిరమునందు ధరించాలి. అది సకలపాపఘ్నం. సర్వ సౌభాగ్యకరం.

అష్టోత్తరశత రుద్రాక్షలను మాలగా కూర్చి ధరించిన వానికి అశ్వమేధయాగ పుణ్యఫలం, అంతమందు శివ సాన్నిధ్యం సంప్రాప్తిస్తుంది.

జపమాల :- రుద్రాక్ష ముఖము నందు రుద్రుడు, పుచ్ఛము నందు విష్ణువు అధిదైవతములుగా వుంటారు. ఇరవై అయిదు రుద్రాక్షలను గోపుచ్ఛవలయాకారముగా మాలిక కూర్చాలి. కూర్చినపుడు ముఖముతో ముఖము పుచ్ఛముతో పుచ్ఛమును కలిపికూర్చాలి. ఈ లెక్కకు మించి కూర్చినదానికి నాగపాశమాలిక అని పేరు. ఈ విధముగా కూర్చిన మాలిక వల్ల మంత్రసిద్ధి కలుగును.

కంఠమునందు, శిరమునందు, కరమునందు, కర్ణమునందు భక్తితో రుద్రాక్ష ధారణ చేసినవాడు శంకరునివంటి వాడవుతాడు. ప్రాణావసాన సమయమున భక్తితో రుద్రాక్ష ధరించిన వానికి రుద్రత్వం వస్తుంది. పునర్జన్మం ఉండదు.

రాత్రి పరుండునపుడు కంఠమందుంచరాదు. స్నానం చేసేటప్పుడు రుద్రాక్షనుండి పడే జలబిందువులు ఆరోగ్యాన్నిస్తాయి. ఉసిరికాయ ప్రమాణంగల రుద్రాక్ష ఉత్తమం. రేగుపండు ప్రమాణం గలది మధ్యమం. పెసరగింజ ప్రమాణం గలది అధమము. విభూది ధారణవల్ల చక్కటి కాంతి, ధైర్యము, బలము కలుగును. గ్రహపీడ, అకాలమరణం తొలగును.

విభూది ధారణ మూడు రేఖలు బ్రహ్మ విష్ణు రుద్రులకు సంజ్ఞలుగా భావించాలి. స్నానం చేసి నుదుట విభూది లేకుండా శివుని పూజిస్తేఫలం సున్న. విభూది ధరించేవారికి వాత పిత్త కఫముల వల్ల వచ్చే రోగాలు రావు.

నిత్యము విభూది ధారణ చేయువారికి రుద్రత్వము లభిస్తుంది. అంత్యమందు కైలాస ప్రాప్తి పొందుదురు.

65) ఈశ్వరునికిచ్చిన జ్వాలాహారతి (జ్వాలాతోరణం) లో కాలగా మిగిలిన గడ్డిని పశువులకు పెట్టినచో ఆరోగ్యము

66) రుద్రునికి అభిషేక ద్రవ్య ఫలములు :

| | |
|---|---|
| ఆవుపాలతో అభిషేకించిన | సర్వసౌఖ్యములు |
| ఆవు పెరుగుతో | ఆరోగ్యం, బలం, సర్వసౌఖ్యములు |
| ఆవు నెయ్యితో | ఐశ్వర్యవృద్ధి |
| మెత్తని పంచదారతో | దుఃఖ నాశనము |
| తేనెతో | తేజోవృద్ధి |
| భస్మ జలముతో | మహాపాపహరం |
| గంధోదకముతో | పుత్రలాభము |
| పుష్పోదకముతో | భూలాభము |
| బిల్వజలముతో | భోగభాగ్యములు |
| దుర్వోదకముతో | నష్టద్రవ్యప్రాప్తి |
| నువ్వుల నూనెతో | అపమృత్యుహారం |
| రుద్రాక్షోదకముతో | మహైశ్వర్యము |
| సువర్ణజలముతో | దరిద్రనాశనము |
| అన్నంతో | రాజ్యప్రాప్తి, ఆయుర్వృద్ధి, సుఖజీవనం |
| ద్రాక్షరసంతో | సకల కార్యసిద్ధి |
| ఖర్జూర ఫలంతో | శత్రువులకు హాని |
| నేరేడుపండ్ల రసంతో | వైరాగ్యం |
| కస్తూరి జలముతో | చక్రవర్తిత్వం |
| నవరత్న జలముతో | ధాన్యం, గృహ, గోప్రాప్తి |
| మామిడి పండ్ల రసంతో | దీర్ఘవ్యాధి నాశనం |
| పసుపు నీళ్ళతో | మంగళప్రదము |



ఆయా ద్రవ్యములతో శివునకు అభిషేకించిన ఆయా ఫలములు లభించునని మహర్షులచేత చెప్పబడెను.
(రుద్ర కామ్యార్చనా విధానములో యున్నది.)

67) భూలోకములో ఎన్ని పుష్పములు, పత్రములు కలవో వాటిసన్నిటిచే శివుని పూజించిన ఎంత ఫలితము కలుగునో, ఆ ఫలమునకు కోటిరెట్లు, విభూతిచే అభిషేకించిన కలుగును. అష్టైశ్వర్యములు కలుగును.

68) నల్లనువ్వులచే అర్చించిన శత్రునాశనము సిద్ధించును. శ్వేతాక్షతలచే అర్చించిన మోక్షమును కలుగచేయును.

69) అభిషేక జలమును మూడుసార్లు పానము చేసిన మనో వాక్కాయములచే చేసిన పాపములు పోవును. దాన, హోమ, స్వాధ్యాయ, దేవతాపూజలు చేయనివారైనను 'శివపాదోదకము' త్రాగిన మాత్రముననే మోక్షము కలుగును.

70) ఐశ్వర్య లక్షణములు :

1) ఒకరు వాసన చూసిన పుష్పమును పురుషులు తిరిగి వాసన చూడరాదు.
2) కట్టిన పంచను తడిపేవరకు ముందుగా ఎలా కట్టారో అలానే కట్టవలెను.
3) పానుపైమున్న గంధము సరాసరి ధరించకూడదు. చేతిలోకి తీసికొని ధరించవలెను.
4) పిల్లిముట్టిన పదార్థములు భుజించుట పనికిరాదు.
5) నీటిలో తన ప్రతిబింబము చూచుట పనికిరాదు.
6) ఉదయముననే దీపము పురుషుడు తీయుట పనికిరాదు.

71) దేవుడు ఊరేగింపునకు వచ్చినపుడు, పెద్దలను నడిపించుకు వస్తున్నప్పుడు, స్వాగతం చెప్పాలంటే ప్రతి ఇంటి ముందర

బిందెడు నీళ్ళు నిలువుగా పోయవలెను. అడ్డముగా నీళ్ళుపోస్తే గ్రామదేవత వస్తుంది. నిలువు శుభము. అడ్డము అశుభము.

72) ఉసిరిక చెట్టును కార్తీకమాసములో పూజించుట సూర్యునకు సంబంధమున్న కారణం వలన రాబోవు మార్గశిర మాసము అనారోగ్య కారణం కనుక అట్టిది కలగకుండా వుండుటకు పూజించుచున్నాము.

73) జిల్లేడు చెట్టుకి, సూర్యభగవానునికి సంబంధం ఉన్నది. కాబట్టి రథసప్తమినాడు 'ఏడు' జిల్లేడు ఆకులతో పాటు రేగుపళ్ళు తలమీద పెట్టుకొని మూడు పర్యాయములు స్నానం చేయవలెను.

74) శ్రీరామ మంత్రమునకు 'తారక'మని ఖ్యాతి గలదు. ఇంకొకదాని కదిలేదు. రాముడు ఆత్మస్వరూపుడు కనుక ఆత్మారాముడని పిలిచెదరు. కావున చావుబోవువారికి అంత్యకాలమున చెవిలో రామనామము శివుడు ఉపదేశించును.

75) గురువుని మానవునిగా భావించరాదు. మంత్రము నందు అక్షరబుద్ధి పనికిరాదు. అట్లు ఎవరెంచెదరో వారు నరకమును పొందెదరు. గురువుగూర్చి చెప్పవచ్చును. కాని మంత్రము గూర్చి చెప్పరాదు.

76) సంకల్పము చేయుటకు ముందును, అభిషేక కాలమందును. అభిషేకానంతరము నందును ధూప, దీప, నీరాజన సమయములందును. పవళింపుసేవ .యందును ఘంటానాదము చేయవలెను.

77) స్నాన, ధూప సమయములందు 'గంట' ఏకధార్యమందు (ఒకే అంచున) కొట్టవలెను.

78) నీరాజన సమయమందు ఇరు పార్శ్వములకు తగులునట్లు 'గంట' కొట్టవలెను.

79) అర్చనాసమయము నందు, సంధ్యోపాసనయందు పర్యలక్షణ లక్షితములగు ముద్రలు ప్రదర్శించవలెను. ముద్ర అనగా (అగస్త్య సహిత) 'ము' అనుదానికి దేవునికి ముదమును చేయునదనియు. ద్రః' అనుదానికి దుఃఖ పాపములను తరిమి వేయునది అనియు అర్థము.



80) ఆంజనేయులు :

భక్తాంజనేయము, ప్రసన్నాంజనేయము, దాసాంజనేయము, వీరాంజనేయము, పంచముఖాంజనేయము.

81) యాగాగ్ని - యాగం చేయుటకు పుట్టించునది.
యోగాగ్ని - తపశ్శక్తి వలన పుట్టునది.
దావాగ్ని - అడవులను కాల్చునది.
బడబాగ్ని- సముద్రములో వుండునది.
వైశ్వానరుడు అనే అగ్ని - మనిషి శరీరములో ఉండునది.
లౌకికాగ్ని - అగ్గి పెట్టెలో ఉండునది.

మనము సత్యం ఆచరించదగిన ధర్మాలు, నియమాలు అనేకం స్మృతిలో ఉన్నాయి. వాటిలో మనుస్మృతి, పరాశరస్మృతి, బుధస్మృతి, శంఖస్మృతి, అత్రిస్మృతి, విష్ణుస్మృతి, హారీతస్మృతి, యమస్మృతి, అంగీరసస్మృతి, దక్షస్మృతి, వ్యాసయాజ్ఞవల్క్యశాతాతప, కాత్యాయన, సంవర్త, బృహస్పతి, ఉశన స్మృతులు, గౌతమ, వశిష్ఠ, ఆపస్తంబ, బోధామిక సూత్రాలు మన ఆర్ష ధర్మానికి ముఖ్యమైన ప్రమాణాలు. వాటియందు చెప్పిన ధర్మాలు, నియమాలు అన్నింటిని ఆచరించకపోయినా, కొన్నింటినైనా ఆచరణలో పెట్టాలి. ఇవి ఇహపర సుఖాలను ప్రాప్తింప చేస్తాయి.

82) గుడిలో నవగ్రహములకు ప్రదక్షిణ చేసిన తరువాత గుడిప్రాంగణములో కాళ్ళు కడుగుకొనరాదు. గుడి బయట కడుగుకొనవలెను. కాళ్లు కడుగుకొనకుండా ఇంటిలోనికి వెళ్ళరాదు.

"హరిః ఓం తత్ సత్"